శరణాగత రక్షకుడు - గురువా చెప్పినట్లుంది. ఆత్మను ఇంకా చెప్పలేదు.
శ్రీరామ చంద్ర పరబ్రహ్మణే నమః - ఈ శ్రీరాముడే శ్రీ వస్తువు యొక్క అవతారము.
వస్తువు అంటే ఎక్కడో ఒక చోట కూర్చుంటాడని కాదు. ఈ సకల జగత్తు రూపముగా
ప్రకటమైన ఏ సత్-చిత్ బ్రహ్మ గలదో, అది విష్ణు శబ్దము చేత నిర్దేశింపబడుతూ
ఉంటుంది అని చెపితే అది ఆత్మను చెప్పినట్టు. ఈ ఆత్మను చెప్పగానే Doubt. ఒక
అనేమిటంటే ఈ సర్వ వ్యాపకమైన బ్రహ్మ రామునిలా అయింది? అని, దానికి మళ్ళీ
సమాధానం. అంటేల ఆత్మను అంటే ఈ గుణాలని, ఆకారాలని, నామాలని, రూపాలని
చెపితే దాన్ని ఆత్మని అని అనరు. కాబట్టి ఇక్కడ ఆత్మ తత్వాన్ని చెప్పారు. ఆత్మ
తత్వాన్ని మీరు ఎప్పుడైతే తెలుసుకుంటారో మీ గుణాలు, రూపాలు, ఆకారాలు, స్వభావాలు
ఇవన్నీ వేరు వేరుగా ఉన్నా ఆత్మను ఒక్కటే, అది పూర్ణము, అది బ్రహ్మ అని తెలిసి
పోతుంది. మీరు తెలుసుకోకుండానే వాదము మొదలుపెట్టి ఆత్మ బ్రహ్మ ఎలా అవుతుంది
అని అంటే ఎవడు ఏమి చేస్తాడు గానీ, మీరు ఒక్క పనులు ఓపిక పట్టి తెలుసుకుంటే
ఆత్మ బ్రహ్మ - అంటే పూర్ణము అని అర్థము - అని దాంట్లో సందేహానికి తావు ఏమి
ఉండదు. కాబట్టి ఈ పరమార్థ ఆత్మ తత్వ నిరూపణము. పరమార్థ అంటే Absolute reality
what do you mean by absolute reality? for Eg: నేను ఎవరు అని మీరు ప్రశ్న
వేసుకోండి. వేసుకోగానే నేను తండ్రిని, కొడుకుని చూసి అది పరమార్థం ఎలా అవుతుంది? ఎందుకంటే
ఆ కొడుకు పుట్టక ముందు నీవు ఉన్నావు. నీకి కొడుకు దెబ్బలాట వచ్చి నువ్వు నా
కొడుకువు కావు అని అనుకుంటే అప్పుడు కూడా ఉంటావు. అది అన్నవాడు కూడా నీదే
ఈ విధంగా తండ్రి అనేది వాడియొక్క Absolute status కాదు అది Relative status. ఎవడు
కూడా కొడుకు ఉంటే నీవు తండ్రి. అలాగే భర్త, భార్య, officer, Any profession are
are relative status. మరి నీ అసలు status ఏమిటి? కాబట్టి మీరు ఏది చెప్పినా
relative status. దాంట్లో absolute ఇంకా రానే లేదు. నేను పురుషుడను, స్త్రీ
relative to the body. I am a cheerful guy. relative to the mind -
unhappy - mind what are you absolutely? అది పరమార్థ ఆత్మ తత్వ
నిరూపణము. అది తెలుసు ఈ 20 శ్లోకాలలో చూపిస్తారు. ఈ గ్రంథ ఏదైతే గలదో ఈ
subject matter దీనికి ఒక పేరుంది. దాని పేరు సాంఖ్యం. ఆ పేరు ఎందుకు వచ్చిందంటే
"సంఖ్యక్ ఖ్యాయతే అనేన" ఖ్యాయతే అంటే జ్ఞాయతే. ఈ subject matter

ఈ శ్లోకం మీరు చదువుతుంటే మీకు మీ స్వరూపం చక్కగా తెలుస్తుంది. దీని ద్వారా
చక్కగా తెలుసుకుంటారు. మరి దానికి సాంఖ్యము అని పేరు. సాంఖ్య, సం - అంటే చక్కగా
ఖ్య - అంటే తెలుసుకోవటము. సం చక్కటి జ్ఞానము. అదే సాంఖ్యము. ఇది ఒక బుద్ధి
~~ఇస్త బుద్ధి~~ అంటారు.

అవిప్లవయా బుద్ధి: ఆత్మనో జన్మాది షడ్విక్రియాభావాత్ అకర్తా ఆత్మా ఇతి

→ ఈ సాంఖ్య బుద్ధి ఎలా ఉంటుందో చెప్తున్నారు.

→ మీరు ఈ సాంఖ్య శాస్త్రం -20 శ్లోకాలు మీరు చదువుతుంటే మీకు జ్ఞానం కలుగుతుంది విషయం తెలుస్తుంది, జ్ఞానం కలగడం అంటే విషయం తెలుస్తుంది "అవిప్లవయా బుద్ధి"

→ ఏమిటి తెలుస్తుందో తెలుసుకునే విషయం - "ఆత్మనః జన్మాది షడ్విక్రియా భావాత్" ప్రతి పదార్థానికి ఆరు వికారములు ఉంటాయి. వికారములు అంటే మార్పులు.

వికారము అంటే తనంతట తానుగా వచ్చే మార్పు. క్రియ - విక్రియ.

Eg: జుట్టు తెల్లబడటం - విక్రియ. దానికి నల్ల రంగు వేస్తే అది క్రియ. మీరు సంకల్పం చేసి చేసేదాన్ని క్రియ అంటారు. దానంతట అదే అయ్యేదాన్ని విక్రియ అంటారు అని సంగతి

→ ఇక్కడ వికారములు 6 - వీటిల్లో వీడి ప్రమేయము ఏమి ఉండదు. వీడు, ఊరికే నా దేహం అని అంటుంటాడు. ఈ ఆరు వీటిలో సంబంధం లేకుండా అవుతుంటాయి. నా జుట్టు అంటాడు ఏమిటి వీడి జుట్టు, వీడి permission అడిగి అది పెరుగుతుందా? తెల్లబడుతుందా? ఊడిపోతుందా? లేదు. ఇవన్నీ కూడా వికారములు. ఈ రకంగా దేహంలో వికారాలు వస్తుంటాయి. యాస్కాచార్యుడు - గొప్ప మహర్షి - ఆయన పదార్థము వికారములు ఆరు అని చెప్పాడు - ① జాయతే - పుట్టినాడు, ② అస్తి - Eg: there is a new member, ③ వర్ధతే - పెరుగుతున్నాడు. ration card లో ఎక్కించిన తరువాత మనకి Ration ఎక్కువ ఇస్తారు ఇంక ఇప్పటి నుండి, ④ విపరిణమతే - దీని తర్వాత ఏమిటంటే బట్టల size fit అయిపోవటం లాంటిది, ⑤ అపక్షీయతే - క్షయమవుతున్నది - sugar, B.P. etc final గా ⑥ నశ్యతే =

→ ఈ 6 వికారాలు ఆత్మకి లేవు. ఆత్మకి లేకపోవచ్చు నాకు ఉన్నాయి అని అనుకోవద్దు. ఆత్మ అంటే మీరే. ఆత్మకి లేవు అంటే మీకు లేవు అని. అందుకనే సాంఖ్య శాస్త్ర పాఠం ఇది లోక విరుద్ధంగా ఉంటుంది. ప్రతివాడు ఈ ఆరు వికారాలు తనకి ఉన్నాయి అని అనుకుంటాడు

→ కానీ ఈ ఆరు వికారములు ఆత్మకి లేవు. అంటే ఆత్మ పుట్టలేదు. ఆత్మ మరణించదు

ఆత్మ పెరగటం లేదు, క్షయము కాదు.

*→ ఒక వాక్యం ఉంది, ఆ వాక్యం లోతుగా చూస్తామంటే మొత్తం గడబిడే. అదేమిటంటే
* "న కర్మణా వర్ధతే నో కనీయాన్" - పిడుగు లాంటి వాక్యం. ఇప్పుడు ఒకాయన కర్మ చేస్తున్నాడనుకోండి ఏమని అనుకుంటాడు? ఈ కర్మ చేసినట్లయితే It embelishes me. అది నాకు ఒక నూతన ఉత్కృష్టని కొత్తగ తీసుకొస్తుంది అనుకొని కర్మ చేస్తాడు. కర్మ చేయకపోతే అది ఒక లోటు అని అనుకుంటాడు.

→ కానీ ఆత్మ యొక్క స్వరూపము కర్మ చేతను పెరగదు, కర్మ చేయకపోతే తగ్గదు. హ్రాసము లేదు. వృద్ధి లేదు. వృద్ధి, హ్రాసములకు అతీతమైనది. Eg:- 100కి 10 కలిపితే, తీసేస్తే. అలాగే 1,00,000, కోటి, పదికోట్లు - అనంతము - Infinit

→ కాబట్టి అనంతము - ఆత్మ. "న కర్మణా వర్ధతే, నో కనీయాన్" - ఇప్పుడు ఈ మాట మన కర్మకి చెప్పామనుకోండి వాడు ఏమైపోతాడు? కుప్పకూలిపోతాడు.

→ కాబట్టి ఆత్మ తత్వ నిరూపణము - ఆ బుద్ధి, ఆ understanding వేరే దాన్ని మనుష్య కర్మలో ప్రవేశపెట్టను. అదలా ఉండాలి - దాని చేయవలసినవాడు చేస్తుంటాడు. మిగతా వాళ్ళు కర్మలో ఉండేవాళ్ళు కర్మలో ఉంటారు. అంతే గాని రెండింటికి సమన్వయం చేస్తాను అనే మాట పొసగదు. we will come back - (22-01-20:00)

→ కొంచెం మీమాంసలో పడతాం. విచారం ఎప్పుడూ కూడా విచారానికి అలవాటు చేసుకోవాలి. ఈ శాస్త్రీయమైన విచారము - అంటే చర్చ దానికి కొంచెం శ్రద్ధగా మనం గమనిస్తే తెలుస్తుంది. You have to discover a taste - stright గా taste ఉండకపోవచ్చు. కొంత ప్రయత్నం చేసినట్లయితే రుచి వస్తుంది. ఆవిధంగా ఆ చర్చని తెలుసుకునే ప్రయత్నం చేశారంటే మీరు బుద్ధికి మంచి పదును పెడుతున్నారని అర్థం. మంచి గంభీరమైన విషయాలని ఆలోచించటం ద్వారా మెదడుకి పదును పెట్టినట్లయితే తద్వారా ఆ Neurons అన్నీ కూడా చాలా Activate అవుతాయి. లేకపోతే dullగా పడి ఉంటాయి. So Neurons కూడా పని చేయాలి గద, చేతులు, కాళ్ళే కాదుగద. భగవంతుడు వాటిని పని చేయటం కోసమే పెట్టాడు. ఎప్పుడైతే Neurons fire (పని) చేస్తూ ఉంటాయో శరీరంలో కూడా, Endocrinological systems అలా కూడా clean గా పని చేస్తాయి. మనిషి ఆరోగ్యంగా ఉంటాడు. ఎంత సేపటికి Newspaper తప్పించి అంతకంటే పెద్దగా ఏమీ చదవను అనే level లో ఉంటే అది It contributes

అంతేకాక గంభీరమైన విషయాలకి. ఏమంటారంటే
a general lack of well being. Meditation
ముఖ్యంగా retirement వయస్సులో, Middle age తరువాత వాళ్ళకి
చేస్తూ ఉండే వాళ్ళకి వాళ్ళు ఆరోగ్యంగా ఉంటారు. కాబట్టి ఇటువంటి విచారము దాని
కొంచెం పరిశీలనగా చూడాల్సిన అవసరం ఉన్నది. చూద్దాము

→ జ్ఞానము - కర్మ అని రెండు ఉన్నాయి. జ్ఞాన నిష్ఠ వేరు, కర్మ నిష్ఠ వేరు. రెంటిలో జ్ఞాన
నిష్ఠ అన్నది మన అంతిమ లక్ష్యం. కర్మ నిష్ఠ అన్నది ఆ లక్ష్యానికి మనల్ని అర్హులు చేసే
ఉపాయము. ఇది (కర్మనిష్ఠ) ఉపాయము, జ్ఞాన యోగము ఉపేయము. Goal అన్నమాట
Eg:- M.B.B.S చదవటం ఉపాయము, Doctor practice చేయటం లక్ష్యము అన్నట్లుగా

→ ఈ రెండూ కూడా ఇక్కడ ఈ సందర్భంలో seperate గా పెట్టాల్సి ఉంటుంది
ఎందుకంటే ఈ జ్ఞాన నిష్ఠలో ఉండటమనేది అనాదిగా ఏదైతే ఉన్నదో అది మన నిత్య
జీవితంలో ఉండే పద్ధతికి చాలా విలక్షణంగా ఉంటుంది. మనం నిత్య జీవితంలో
దేహము నందు వచ్చే వికారములు {దేహము- మనస్సు కూడ నిజానికి మూడు అవి. దేహ
ఇంద్రియ - మనస్సంఘాతము. ఇది మనిషి is a complex being. మనిషి లోపల అనేక
అంశములు స్థూలమైనవి, సూక్ష్మమైనవి అన్నీ ఉంటాయి} So ఇది దేహేంద్రియ మనః
సంఘాతము Body, Mind sense complex. So ఈ దేహము, ఇంద్రియము
మనస్సు ఇవన్నీ ఉన్నాయి. దేహములో మార్పులు వస్తుంటాయి. వికారములు - అంటే మన
ప్రమేయం లేకుండా వచ్చే మార్పులు (వికృతి), ఇంద్రియాలలో వికారాలు Eg:- కళ్ళజోళ్ళు మార్చుకోవటం
etc. చెవికి Mechines, వొంటికి cream. ఇవన్నీ కూడా ఏదో రకంగా ఇంద్రియాలలో వచ్చే
వికారాన్ని Arrest చేసే ప్రయత్నం. So ఇంద్రియాలలో వికారాలు వస్తాయి. మనస్సులో
వికారం వస్తుంది. మనస్సు ఎలాంటిదంటే, day by day it changes, by every day it
undergoes a change. మీరు ఆలోచించి చూడండి 10 సంవత్సరాల క్రితం మీరు
ఆలోచించే దృష్టికోణం ఎలా ఉండేది? ఇప్పుడు ఎలా ఆలోచిస్తున్నారు? ఎంత మార్పు
వచ్చిందో చూడండి. మనం వెనక్కి చూసుకుంటే మనకే అనిపిస్తుంది. నేనేనా అలా
ఉండేవాణ్ణి, ఇప్పుడు ఇలా ఉన్నాను అది ఒకప్పుడు Improvement కావచ్చు
ఒకప్పుడు Downword trend కావచ్చు whatever. So మనస్సులో ఆలోచించే
పద్ధతిలో చాలా మార్పులొచ్చేస్తాయి. ఒక వ్యక్తి - 20వ ఏట Communist
ఉండే వ్యక్తి 40వ ఏట Religionist అవుతాడు కూడా Eg:- గుడిపాటి
వెంకట చలం.

→ ఏ change వచ్చినా కూడా ఆ change యొక్క అధిష్ఠానంగా, దాని substratum
గా change less background ఉంటుంది అలాగే దేహము బాల్యావస్థలో ఉండి
తరువాత యవ్వనం, మధ్య వయస్సు, పెద్ద వయసు. దేహంలో మార్పులు వస్తున్నాయి
అంటే ఆ మార్పులకు అధిష్ఠానంగా మార్పులు లేని తత్త్వం ఒకటి ఉంటుంది
అది, దానికి ఒక పేరు పెట్టారు మనవాళ్ళు వేదాంతులు, దాని పేరేమిటంటే నేను.
నేను మారదు చూడండి Eg:- నేను చిన్నప్పుడు గోలీకాయలు ఆడుకునేవాణ్ణి ఇప్పుడు
నేను నా మనవళ్ళు ఆడుతుంటే చూస్తున్నాను. అని అంటాడు. అప్పుడు, ఇప్పుడూ నేనే
అదే నేను. కానీ ఆ దేహం ఇప్పుడు లేదు, ఆ కాలం, దేశం ఇప్పుడు లేదు.
→ కనుక మారకుండా ఒక తత్త్వం కలదు. Rock like దాన్ని కూటస్థము అంటారు
ఏ రకమైన వికారములు లేని ఒక బండలాంటి Rock like reality ఒకటి ఉంది
దాని పేరే ఆత్మ. అదే నేను. అదేది వల్ల ఇంకోటి తెలుసుకొను. అదే నేను (ఆత్మ)
ఆ సత్యాన్ని ఆత్మ జ్ఞాని తెలుసుకుంటాడు. సాంఖ్య అంటే జ్ఞానము గలవాడు ఆత్మ
జ్ఞానికి ఆ సత్యం తెలుస్తూ ఉంటుంది. కాబట్టి ఆత్మ జ్ఞాని దేహంలో వచ్చే వికారాల
చేత ప్రభావితుడు కాడు. అతనిపై ఏ ప్రభావము ఉండదు. దేహంలో ఏదైనా అనారోగ్యం
చేసిందనుకోండి. ఆత్మ జ్ఞాని కంగారు పడడు. నిజానికి నేనో ప్రతిపాదన చేస్తాను
→ శరీరంలో ఏదైనా అనారోగ్యం చేసినట్లయితే Actual గా physical discomfort
కొంత ఉంటుంది, Mental discomfort ఓ కొంత ఉంటుంది దీంట్లో ఏ % వరకు
అని ఆలోచిస్తే Eg:- జ్వరం - physical గా ఏవో చేయటం. ఒళ్ళంతా నొప్పులుగా ఉంటుంది
physical discomfort తో పాటుగా there is a mental discomfort. మనస్సుకి
ఒక తీవ్రమైన దుఃఖం కలుగుతుంది ఈ రెండూ కలిసి మనం అనుభవిస్తాం. ఇంట్లో
physical discomfort కి ఏమి చేయగలిగింది ఏమీ లేదు వచ్చేసింది already
incubation period కానీ దీని అనుభవించే దుఃఖంలో దాని యొక్క పాలు ఎంత? అని
అనుకొని పరిశీలిస్తే, కేవలం 10% మాత్రమే ఉంటుంది. మిగిలిన 90% కూడా ఆ దుఃఖం ఎలా
వస్తుందంటే Eg:- ఉద్యోగం చేస్తే - leave waste అయిపోతుంది, తరువాత నేను ఉద్ధరించాల్సిన
సంసారం అంతా చాలా పెద్ద సంసారం ఉంది అయిపోయాడా ఇంకా నేను Bed కి, Hospital
కి fix అయి ఉన్నాను ఎటు కదలటానికి వీలు లేదు. చేయాల్సిన పనులు చాలా ఉన్నాయి.
నామీద ఆధారపడిన వాళ్ళు చాలామంది ఉన్నారు నేను ఉద్ధరించాల్సిన వ్యవహారాలు చాలా

కాబట్టి మనస్సులో కూడా నిరంతరంగా వికారాలు వస్తూ ఉంటాయి. ఈ వికారాలను
ఆరింటిగా విభాగం చేసారు. జడత, శక్తి, వక్రత, విపరీతమత, ఉపేక్షయత, నస్త్ర.
→ ఇప్పుడు మానవుడు మనం ఆలోచించాలి ఈ వికారములను అన్నింటిని తన
నిత్య మీద ఆరోపించుకొని దు:ఖాన్ని అనుభవిస్తూ ఉంటాడు

Eg ÷ జుట్టు తెల్లబడింది. వికారము అది. అదేం మనం కావాలని చేసింది ఏమీ
కాదు. దానంతట అది అయింది. వికారము. ఇప్పుడు ఈ వికారము వచ్చిందనే
సంగతి కూడా గమనించకుండగా నవ్వుతూ ఒకాయన ఉన్నాడు. ఇంకొకాయన ఈ వికారం
వచ్చేసింది. ఇది రానివ్వక వీలు లేదు. He wants to stop it. How? initially
pluck చేస్తుంటాడు. తరువాత రంగువేస్తాడు. ఇంక commitment జుట్టును నల్లగా
చేసుకోవటానికి తరువాత ఇంకొకడు రంగు వేసుకున్నావు కానీ మీరు ఈ రంగు మీరు
వేసుకున్నారనే సంగతి మీకు తెలుస్తూనే ఉంటుంది ఎదురువాళ్ళకి కూడా తెలుస్తూనే ఉంటుంది.
మొత్తానికి మీరు ఏం Achive చేసినట్లు దాంట్లో. You are trying to impress the
people. వాళ్ళు Impress అవరు. మీరు రంగు వేసుకుంటున్నారని తెలిస్తే అసలే అవరు. కాబట్టి
what is that we are achieving? it is huge deception. అజ్ఞానం తప్ప
ఇంకొకటి లేదు. ఇంకొకాయన ఉన్నాడు He just ignores it & keeps quite
అది చాలా చిన్న విషయం అని మీరు అనుకోవద్దు. దాంట్లో that mental Energy
dissipate అయిపోతుంది. అయితే న జుట్టు తెల్లబడిపోవటం అది ఒక వికారము
ఒక మార్పు. దాన్ని Arrest చేసే ప్రయత్నం అది ప్రతి అడుగులోను fail అవుతుంటుంది
దాని వలన కలిగే మార్పు. So ఈ విధంగా an entire false value system is
brought into the life. Life style అంత పాడైపోతుంటుంది చూడండి. false value
దాంట్లో ఏమీ సంతృప్తి లేని value అది. కాబట్టి ఈ విధంగా Mental Energy dissipate
అయిపోతుంటుంది.

*→ కాబట్టి ఆత్మ జ్ఞానము వలన లాభము ఏమిటంటే నీవు ఈ వికారముల గూర్చి
కాదు. ఎప్పుడూ కూడా ఒక law ఉంటూ ఉంది Vedantic law. Spiritual
law. "EVERY CHANGE TAKES PLACE A CHANGELESS
BACKGROUND". ఇది law. మార్పు వికారము వచ్చింది అంటే ఈ law
ని మన వేదాంతం ఏనాడో చెప్పింది – theritical physics

Eg ÷ Ether is the medium for light to flow. – space itself could be that medium

ఉన్నాయి అన్నీ జరిగిపోయాయి అని నేను I am trying to give a shape to his general since of discomfort. జ్వరం వచ్చినప్పుడు physical discomfort 10% Mental discompert 90%. దీన్లో ఇంకొకటి కూడా ఉంటుంది. నేను నా పాత్ర కాలేనేమో మంచం మీద ఇలా జ్వరం వచ్చి పడుకున్నాను. మిగతావాళ్ళందరూ Enjoy చేస్తున్నారు అనే ఒక feeling కూడా ఉంటుంది.

→ ఏ అనారోగ్యమైనా సరే. ఈ రోజుల్లో ఈనాడు science బాగా అభివృద్ధి చెందింది అనారోగ్యానికి మందులు అవి వచ్చాయి. Appolo hospital లాంటి వాటికి వెళితే మీ purse ఖాళీ అవుతుంది గానీ 5-star hotel కంటే ఇంకా happy గానే ఉంటుంది అక్కడేమీ Discomfort ఏమీ ఉండదు. కానీ మనిషి comfortable గా ఉండలేడు. ఎందుకంటే physically he is ok. మందులు ఇవన్నీ సౌకర్యాలు physical గా they keep him OK. But that mental balence పోతుంది that mental stability I am ok అనే feeling పోతుంది. He develops a sense of non-well being. ఇది ఎవళ్ళు develop చేసుకొన్నారు మిత్రులారా? నిజానికి Reason ఏమీ లేదు. మూడు రోజులో 5 రోజుల్లో జ్వరం ఉంటుంది తర్వాత పోతుంది. సంసారం ఏమీ ఆగిపోదు let me tell you మనం నాలుగు రోజులలో ఏమీ ఆగిపోయేది లేదు మనం లేకపోతే వారం రోజులు ఏమిటి మరొకటి ఏమిటి? ఏమీ ఆగిపోదు. అన్నీ నడుస్తూ ఉంటాయి. ప్రకృతి ధారలో సర్వం నడుస్తూ ఉంటుంది. ఏదో నేను ఉండి దీనికి లేస్తున్నాను నేను ఉండి దీన్ని నడిపిస్తాను అని వట్టి అజ్ఞానం గానీ, నేను ఉండి నడిపించేది ఏమీ లేదు. కనుక నేను చేయవలసింది రెండు ① శరీరము, మనస్సు, నేను నేను, [illegible] దూరపుటంచే గాని శరీరము, మనసు నేను కాదు శరీరంలో వచ్చే వికారాలు శరీరానివే కానీ నావి కావు. అంటే అర్థం ఏమిటి? He has to develop a space. దీనిలోపల ఒక space develop చేయాలి. వివేకము అంటారు The space of discrimination మనస్సులోపల the space of discrimination మనస్సులోపల space చాలా ముఖ్యం. Gita class కి వస్తే కలిగే లాభం ఏమిటంటే మీ మనస్సులోపల మరింత space వస్తుంది. మనస్సుకి బయట అవి మనిషి (ఒడిదుడుకులు) ఉంటారు. అలా కాకుండా మన మనస్సులోపల మనకి space వస్తుంది. I can look at my mind as if I step away నా మనస్సులోపల నేను మనిషిగా [illegible]

ఒక అడుగు వెనక్కు వేసి ఈ మనస్సు ఇలా ఉన్నది ఎందుకు? దీంట్లో ఈ అసూయ ఎందుకు కలుగుతుంది? దీంట్లో ఈ బెంగకి కారణం ఏమిటి? sense of insecurity కి కారణం ఏమిటి? అని ఈ విధంగా, slow గా మనం గనక వైరాగ్యం గనక ఉన్నట్లైతే, Attachment లేనట్లు అయితే ఏం ఫరవాలేదు వస్తుంది జ్వరం తగ్గుతుంది. అని ఆ physical discomfort ని మీరు Endure చేసేస్తారు. మందు వేసుకుంటారు. మానసికంగా ప్రసన్నంగా ఉంటారు. వీరు దుఃఖము 90% తగ్గిపోతుంది. Doctor కి కూడా వైద్యం చేయటం తేలికవుతుంది. B.P. ఉన్నవాడికి వైద్యం చేయటంలో heart behavior ఏ కొంత వీడి బెంగ మరికొంతను. these are all problems

→ So ఆత్మ, మనస్సు, ఇంద్రియములు, దేహము. (దేహేంద్రియ మనస్సంఘాతమే — ఆత్మ). వికారములు అన్నీ దేహేంద్రియ మనస్సంఘాతము లోనే ఉంటాయి. ఆయు వికారాలు కూడా. ఆత్మ యందు ఏ వికారము ఉండదు — సాంఖ్యము

→ తరువాత ఇంక "అకర్తా ఆత్మా". చెప్పు కాదు అంటారు ఆత్మ అకర్త. ఇది సాంఖ్యము. మీరు గమనించండి. ఏ కారణం కర్మ చేస్తున్నాడు. కర్మ చేస్తున్నాడు అంటే నేను కర్మని చేస్తాను. అని సంకల్పం చేయాలా? సంకల్పం లేకుండా కర్మ చేస్తాడా? చేయడు. నేను కర్మని చేస్తాను అని ముందు సంకల్పం చేస్తాడా? కర్మను చేసేవాడు సంకల్పిస్తాడు. అంటే వీడు ముందు కర్మని చేసేవాడు అయి ఉండాలి. అంటే కర్త అయి ఉండాలి వీడు తనను తాను కర్తగా స్వీకరించాలి. He has to take himself as the doer అప్పుడే నేను కర్మను చేస్తాను అని సంకల్పిస్తాడు. కాని మనం ఎలా జీవిస్తాము మీరు ఆలోచించండి. "I am the doer & I am the Enjoyer" అని "నేను కర్తను, నేను భోక్తను" అని ప్రతి మనిషి కూడా ఈ విధంగా జీవిస్తాడు. దీనికి Enterprenuership అని పేరు. Modren పరిభాషలో Ownership & Enjoyer ship అని అంటారు. మనం ఏమనుకుంటామంటే నేను కర్తని, నేను భోక్తని. నాకు ఈ భోగాలు కావాలి. కాబట్టి ఈ కర్మలను చేసుకుంటాను — భోక్త నుండి ప్రారంభం అయితే. నేను ఈ కర్మలని చేస్తాను కాబట్టి, నేను భోక్తని అవుతాను — కర్త నుండి ప్రారంభం అయితే. కాని లోకంలో మీరు ఎవర్నైనా అడిగినా, నేను కర్త, భోక్త అని చెప్పలేరు.

→ అయితే దీనికి, ఆత్మ జ్ఞానానికి ఏమి సంబంధం లేదు.

→ ఆత్మ అంటే మీ యొక్క అంతర తమమైన స్వరూపము అంటే your core of the beeing మీ యొక్క యదార్థ స్వరూపము నందు కర్తృత్వం కానీ భోక్తృత్వం కానీ ఉండదు. ఇప్పుడు మీరు చెప్పండి ఆత్మ అకర్త, అభోక్త అనే జ్ఞానం నందు పరినిష్ఠుడై ఉన్నవాడు. one who abides in that knowledge వాడు కర్మ యోగానికి వాడికి అధికారం లేదు అన్నారు శంకరులు ఒకసారి. ఎందుకంటే కర్మ యోగము కర్త కోసం ఉంటుంది. కర్త కాని వాడికి కర్మ యోగము ఏమిటి? కాబట్టి వాడికి కర్మ యందు అధికారము లేదు అన్నారు. అర్జునుడు శ్రీకృష్ణుడితో నేను కర్మను చేయను అంటే శ్రీకృష్ణుడు అర్జునుడితో ఏమన్నాడు?
"కర్మణ్యేవాధికారస్తే" - కర్మలను చేయను అనే ఆ ఊహలు అవి నీకు లేవు ఎందుకంటే అకర్త ఆత్మ జ్ఞాన నిష్ఠునికే మాత్రమే ఆ ఊహలు ఉండి- అంతే గాని నేను కర్మని అనే పరిచ్ఛిన్న భావం లో ఉన్న అజ్ఞానికి ఆ ఊహలు ఎక్కడి నుంచి వస్తుంది వాడికి? వాడు కర్మలని చేయాల్సిందే. "కర్మణ్యేవ అధికారస్తే" నీకున్న అజ్ఞానము కారణంగా నీకు కర్మలను చేసే అధికారం ఉంది గాని నువ్వు ఇంకా ఆ స్థాయికి ఎదగలేదు. ఆ స్థాయికి ఎదిగినప్పుడు నీవు సహజంగానే అకర్త ఆత్మ స్వరూపుడిగానే ఉండిపోతావు. కాబట్టి ప్రస్తుతానికి నీ కర్తవ్య కర్మని నువ్వు చెయ్యి. అని శ్రీకృష్ణుడు అర్జునుడికి బోధిస్తాడు.
→ కాబట్టి చూడండి ఇటు సాంఖ్యము, ఇటు కర్మ యోగము రెండింటికి ఇంత తేడా ఉంది. అయితే కర్మ యోగము ద్వారా కర్మలను చేయటం ఎందుకు? అంటే కర్మ యోగము ద్వారా కర్మలను చేసినట్లయితే నిత్యముగా అంతఃకరణము శుద్ధమై ఆత్మ అకర్త అని తెలుస్తుంది. ఆ సత్యము అవగాహనమవుతుంది మీరు కర్మ యోగాన్ని అనుష్ఠించలేదనుకోండి, అప్పుడు అంతఃకరణంలో రాగ ద్వేషాలు దృఢంగా అలాగే నిలిచి ఉంటాయి. అప్పుడు ఆత్మ అకర్త అని గురు పాఠం చెప్పినట్లయితే. ఏదో ఈ స్వామి ఇలానే చెబుతాడు. లోకానికి సంబంధం లేని పాఠం కాదు ఇది లోకవిరుద్ధంగానే ఉంటుంది ఈ పాఠం. అని మనకి విచిత్రంగా అనిపిస్తుంది
→ Eg: వివేక చూడామణి - topic - ఆత్మ అకర్త - physics professor.
ఒక సందర్భంలో నేను కర్త, భోక్త అని ఒక సందర్భంలో అనుకుంటాం. నేను చెప్పిన పాఠం ఆ సందర్భానికి సంబంధించినది కాదు. You have to shift the

paradyme. Eg:- నేను ఒక పరిచ్ఛిన్నమైన దేహేంద్రియ మనస్సంఘాతము, నేను, పరిచ్ఛిన్నమైన జీవున్ని నేను. I am an isolated Ego in a seperate body & therefore I am the doer & I am the enjoyer అనే paradigm లో మీరు ప్రశ్న అడుగుతున్నారు. నేను ఈ దేహేంద్రియ మనస్సంఘాతము అనే దాన్లో ప్రకటము అవుతూ, దీనికంటే విలక్షణమైన సర్వ వ్యాపకమైన దేశ కాలములకు అతీతమైన అద్వయమైన, అవికారి అయిన, అంటే షట్ వికారములు లేని నిర్గుణమైన, నిరంజనమైన ఆత్మ తత్వము అక్కడ అని నేను చెప్తాను. ఆ paradigm ఈ paradigm వేరు అని నేను చెప్తాను. Eg:- Newton's law యొక్క paradigm & Eighnstin's theory of relativity యొక్క paradigm కి difference ఉంటుంది similar to that అని చెప్తాను. paradigm shift అయితేగాని ఈ పాఠం, ప్రతిపాదనలు మనకు fit కావు.

→ అంతేతప్ప శ్లోకములు ఏమంటున్నాయంటే చూడూ ఇది సాంఖ్య యోగము, ఇది కర్మ యోగము. దీని పద్ధతి వేరు. దాని పద్ధతి వేరు. ఈ రెండింటినీ కలిపి ఒకే systemలో కూర్చాలనుకుంటే, సముచ్చయము అసలు కుదరదు. సమన్వయం కుదురుతుంది గాని సముచ్చయం కుదరదు. ఇది topic

→ So "అవ్యయము బుద్ధి:- ఈ బుద్ధి ఎలాంటిదంటే 2వ - ఆత్మన: జన్మాది సర్వక్రియా భావాత్ - ఆత్మయందు జన్మ - మరణము మధ్యలో ఉండే ఇంకోనాలు మొత్తం ఆరు వికారాలు. ఈ వికారాలు ఆత్మయందు లేవు. అవినాశి ఆత్మ అకర్తా. ఆత్మయందు కర్తృత్వం లేదు. ఆత్మయందు కర్తృత్వం లేదు అంటే నీ అసలు యదార్థ స్వరూపము కర్తకాదు అని అర్థము. Are you ready for it. That is సాంఖ్య యోగము. Weather you ready for it or not. you just understand it as such - సాంఖ్య యోగము.

→ "ఇతి ప్రకరణార్థ నిరూపణాత్" - మొత్తం ప్రకరణం అక్కడ ఉన్నది 20 శ్లోకాలు అంతేతప్ప మరణిస్తే దు:ఖించకూడదు అనే శ్లోకం కూడా ఆ ప్రకరణంలోనిదే. ఈ మాట వల్ల మీరు పక్కదారి చెప్పింది. మరణిస్తే దు:ఖించవద్దు. పంపించేటప్పుడు అక్కడినుండి

→ ఎందుకంటే ఆ paradigm వేరు ఈ paradigm వేరు. అంతేతప్ప ఎక్కడైనా వివాహాలు అని అనుకుని సన్న్యాసులు వెళ్లరు Eg:- పూజ్య స్వామీజీ.